స్వశక్తి గ్రంథమాల ౨ (రెండవ కుసుమము)

# శుక, రంభ

అను

## సన్యాసాశ్రమ ధర్మం.

పూర్వకవులచే రచియింపబడినది.




ప్రకాశకులు:—

స్వశక్తి గ్రంథమాల

80, జేమ్సుస్ట్రీట్, శికింద్రాబాద్.



ముద్రితులు:—

కొండా శంకరయ్యగారి ప్రిమియర్ ముద్రాక్షరశాల,

శికింద్రాబాద్.

20-11-40.

వెల

ఒక అణా.

# విన్నపము.

---

స్వశక్తి గ్రంథమాల ప్రథమ కుసుమము "ఆత్మశక్తి" అనే గ్రంథములు వందలకొలది ఉచితముగనే పంచబడినవి. గాన గ్రంథమాలలో ప్రచురింపబడుచున్న గ్రంథములు యింత స్వల్పధరకుకూడ కొనుటకు శక్తిలేనివారు మావద్ద ఉచితముగా పొంది శ్రద్ధతో పఠించి సారాంశానుసారము ప్రవర్తించుటయే మా గ్రంథమాల ముఖ్యాభిప్రాయము. యిందుకుగాను ఉదారహృదయులగు ఆంధ్రసోదరులందరు మా గ్రంథమాల చందాదారులుగా జేరి మా సదుద్దేశములకు సహాయులుగా నుందురని వేడుచున్నారము. రానున్న 2 వ కుసుమము ప్రేమార్పణంనుండి ప్రతీగ్రంథములో చందాదారుల నామధేయములను తెలుపబడును.

చందావివరము—వార్షికము.

| | | | |
|---|---|---|---|
| ఉద్ధారకులు | ... | ... | రూ. 50-0-0 |
| రాజపోషకులు | ... | ... | 25-0-0 |
| ప్రధానపోషకులు | ... | ... | 12-0-0 |
| పోషకులు | ... | ... | 5-0-0 |
| అభిమానులు | ... | ... | 2-8-0 |
| సభ్యులు | ... | ... | 1-4-0 |

ఇట్లు

మేనేజరు

స్వశక్తి గ్రంథమాల.

# పీఠిక

ఈ గ్రంథము పూర్వీకులచే తాటాకుపత్రములపై వ్రాయబడినదానిని సంగ్రహించి సరిగా కానరాని పదములకు నూతన సవరణచే స్వశక్తి గ్రంథమాల రెండవ కుసుమముగా ముద్రింపించినారము. యిటువంటి అముద్రిత ప్రబంధములున్నవారు పంపినయెడల ప్రియపూర్వకముగా నందుకొని ప్రకటించెదము గాన, భాషాభిమానులందరు యీ గ్రంథమును చదివి ఆనందించి మేము చేయు ప్రయత్నమునకు తోడ్పడుదురని నమ్ముచున్నాము. యీ గ్రంథములో రంభ సౌందర్యవికాసములను, బాహ్యార్థపలుకులను పాఠకులు సరకు చేయక, స్వీకరించి, శుకమహాఋషి వుపదేశముల సారమును గ్రహించి సన్యాసాశ్రమ ధర్మము నవలంబించు మహాత్ములు వానివలన లాభము బొందెదరేని మా ప్రయత్నము ఫలించెనని సంతసింపగలము.

సమయము చిక్కువరకును గాఢ వైరాగ్యములో నుండునట్లు డంబాచారములు కొట్టువారికిని, గురువులమనియు ప్రజాసేవకులమనియు, ప్రజల మోసగించు మాయవేషధారులకును, యిటువంటి విషయతృష్ణీకారము. ఇంద్రియనిగ్రహము లేనిది సార్థకము కాదనియు, తుదకు ఇహపరలోక సౌఖ్యములకు దూరులగుదురని నా యభిప్రాయము.

మా గ్రంథమాల దేశసేవకుల యనుగ్రహ పాత్రత గలిగియుండునుగాక, అచిరకాలములో మా గ్రంథమాల స్వేచ్ఛాప్రచార సామర్థ్యమును గలదియగుగాక, ఆంధ్ర సోదరుల సహాయమును బొందునుగాక.

సంపాదకుడు: పి. వెంకటరమణారెడ్డి.

# శు క, రం భ

అను

సన్యాసాశ్రమ ధర్మం.



శిష్యుండు గురునింజూచి, మహాత్మా సంసార సాగరోత్తారకంబగు నొక్క కథ వక్కాణింపుడనిన బెల్లుల్లసిల్లి వలువ నారదునకు జెప్పిన తెరంగున శ్రీ శుక రంభ అను సన్యాసాశ్రమ ధర్మమును జెప్ప నారంభించెను.

హరిమాయ నంటకుండా శుకుండు తపము చేయుచున్నాడని ఇంద్రుండు తెలుసుకొని అందువల్ల తనకేమి ముప్పు వాటిల్లునోయని పరిపరివిధముల చింతించుచు తనలో తాను మాట్లాడుకొనుచు తెలివి తెచ్చుకొని, కంచుకు నొకని గంభీరముగా పిలచి రంభను త్వరగా తీసుకరమ్మని ఆనతిచ్చెను. అంతలో కంచుకి రంభవద్దకు పోయి,

కం॥ రావే ముద్దులగుమ్మా
రావే బంగారుబొమ్మ | రావే రంభా
రావే కంజదళాక్షీ
రావే యాహంసగమన | రమ్మా వేగన్॥

సీ॥ దవళాక్షిరమ్మని | తలవరి పలికిన
నేతెంచి సురపతి | యెదురనిలచి
కరములు ముకుళించి | సురనాధునకు మ్రొక్కి
వెలది తానని యెదే | వేంద్రుతోడ

ననుబిల్వబంచిన । పనియేమినావుడు
ఇంద్రుండుపలికెనా । యింతితోడ
శుకమునితపమెల్ల । జురబుచ్చివేవేగ
రమ్మంచుబలికెనా । కొమ్మతోడ
పద్మాక్షినీవెన్ని । బంగులనేనియు
ధరలోనశుకయోగి । తపముజెఱచి॥
కలికిరమ్మంచు కరుణతో । గారవించి
వస్త్రకాంచనభూషణా । వళులొసంగి
పొమ్మ శుకునితో మరుకేళి । బొందిలెస్స
శుకుని దోడ్కొనిరమ్మువో । సుందరాంగి॥

రంభ విని సంతోషించి గర్వముతో, కనుమూచి తెరచి నంతలో ఘనుడగు శుకయోగి మనస్సు కరుగజేసి, మరులు గొలపి, మరుని జాడదెలపి వెగటు బుట్టజేసి, నా శయ్యకు జేర్చి దినదినమును నా వెంట ద్రిప్పి నా యాజ్ఞప్రకారం నడచునట్లు చేయకపోయినట్టయితే నేను రంభ నేగాను, శుకుని గూడకున్న సుదతినేగాను అని పలుకగా ఇంద్రుండు ఆమె చాకచక్యమునకు ఆనందించి తగిన బహుమానము లిచ్చి దీవించి పంపెను.

రంభ తన గృహంబునకేగి సకల శుకంబుల నెనసియుండె నంత,

గీ॥ అర్కుడస్తమింప । నతి రభసంబున
వృక్షములను జేరె । బక్షులపుడు
జంతుజాలమెల్ల । జెలగుచు తామున్న
వాసములకు జేరె । వలను మెఱసి॥

చీకటు ప్రవేశించినతరువాత ప్రపంచముయొక్క నడత యెట్లుండుననగా,

సీ॥ చీకటిగాజూచి । చిత్తజుడప్పుడు
చెఱకుసింగినివిల్లు । చేతబూని
విరులబాణముగూర్చి । విరజాజిమొగ్గల
ములుకులకునులెస్స । మొనలుదీర్చి
చిగురాకువిడియంబు । బిగియించినదుమున
జెలువంబుగులుకురా । చిల్కనెక్కి
తుమ్మెదబలగంబు । జుమ్మనిమ్రోయంగ
గోయిలలాతని । గొలిచినడువ
నపుడుమదనుండు చెలరేగి । యార్చిపేర్చి
కాముకజనంబు బెగడొంద । గార్ముకంబు
కరముమెరయించి యలుగులు । వరపెనురక
చెలులుపురుషులు వెతిగుంది । వెగడుపడగ॥

ఉ॥ బాలినిజెందియాత్మలను । జాణతనంబునగేలికాగృహా
శాలలకేగియంతతమ । గాదిలికాంతలతోడమన్మధా
కేళిబిగించిచన్గవలు । గిల్లుచుకందువమాటలాడుచున్
స్త్రీలనుగూడిబిట్టరతి । జేయుచునుండిరిగోర్కెదీరగన్॥

ఉ॥ కుక్కుటకెక్కహంసహరి । కుంజరపన్నగబంధనక్రియం
జొక్కుచుసోలుచున్లగువు । జూపుచుజెక్కులునొక్కిస్త్రీలతో
మక్కువగాబెనంగుచును । మన్మధసీరయముప్పతిల్లగా
బక్కబెనంగుచున్మరిసు । ఖోన్నతులన్సుఖియించిరత్తతిన్॥

గీ॥ అంతకంటెము న్నె । యంగనామణిలేచి
జలము దేరబంచి । జలకమాడి
చలువవలువదాల్చి । చతురతమీరంగ
తొడవులెల్లనింతి । తొడగెనపుడు॥

సీ॥ శృంగారమైనట్టి । బంగారుజలతారు
చీరచెంగులు వెన్క । జారవిడచి
పొగరుగుబ్బలమీద । నగరుగంధమలంది
సరసంబుగాబన్న । సరులు దాల్చి
కస్తురినుదుటిపై । సిస్తుగాదీరిచి
కన్నులకాటుక । చెన్నుపరచి
కొప్పెవ్వదగ్రొవ్విరుల్ । గొనబుగాగీల్కొల్పి
సలలితంబుగబట్టు । శాలుగప్పి
కడగియీరీతిసింగార । మావధరించి
వీణచేబూనిమదగజ । విధముమీరు
నడలనేతెంచిసురముని । నాథుడున్న
వనముదగ్గరజేరెనా । వనితయపుడు॥

రంభ సొగసెట్లున్నదనగా,

సీ॥ అళిమాలకలనవచ్చు । జలజాక్షికురులను
నర్ధచంద్రునిమించు । నతివనుదురు
గండుమీనులబోలు । కలకంటికన్నులు
పండువెన్నెలనిగ్గు । పడతినగవు
బంగారుకలశంబు । లంగనకుచములు
యిసుకదిన్నెలబోలు । నింతిపిఱుదు

నలినాక్షినూఁగారు । నల్లచీమలబారు
సింహామధ్యముబోలు । జెలియనడుము
అనుచుమురియుచువర్ణించి । రపుడుసురలు
యిట్టిశృంగారవతి జూచి । నట్టివారు
శీలములుమానిమరునిచే । జాలినొంది
చింతచే నుందురెటువంటి । సిద్ధులైన॥

గీ॥ బ్రహ్మదేవుడైన । భస్మాంగధరుడైన
వ్యాసుడైన । వననివాసుడైన
గాంచివలపుజెంది । కామినియిదియని
పొందజూతురెట్టి । పుణ్యులైన॥

వనములో శుకునికొరకు వెదకుచు బృందారక బృందంబులు బహువారంబులు కైవారంబులు సేయ నవ్వారాహోహ సంతల్లి బిత్తరించుచు అట్టి సమయంబున గులుకు గుబ్బలు బయలుపడకుండా జయ్యాన పయ్యెద సవరించుచు బదంబుల నిడిన పాద కటకంబు లందెలు నటన తాళ రాగ భేదంబులం గంపింప నడుగులిడుచు మృధువచన రచనల నమృతంబు చిలుక జేయుచు నవ్వుచు, సోలుచు, వ్రాలుచు, నీరంబులం దూరుచు జెందామర కొలంకుల కెలంకుల రాయంచ పగిదిం దిరుగుచు పలు తెరంగుల ఆడుకొనుచు హంస నడకలతో తిరుగుచుండెను. ఆ వనంబెట్టిదనిన,

సీ॥ నారికేళంబులు । నాగపున్నాగముల్
హంసఖర్జూరము । లచటగలవు
కదలికాపాటలీ । కరవీర కేతకీ

మాదవీకురువక | మాతులుంగ
జంబుజంభీరక | దంబవృక్షంబులు
పరిపరివిధముల | బ్రబలిలెన్న
రామునికంఠంబు | కాబోలుననదోఁచి
పొదలుచున్నవిచాల | బొలుపుమీర,
ప్రబలిచిగిరించి పూతచే | ననుదినంబు
కాయలునుగాని ఫలియించి | ఘనతమెరసి
యున్నవనమందు మునులుమ | హోన్నతమున
వాసములుచేయుచుందురు | వలనుగాను॥

కం॥ మునులావనమున వేడుక
ఘనతరమైనట్టిమంచి కమ్మనిపండ్ల
ననుదినము ననుభవించుచు
మనమునపరుసంబుగలిగి మనిరెల్లపుడున్॥

మరియు

గీ॥ సకలమైనపక్షి | జాతులావనమున
ఫలములనుభవించి | పలుకుకొనుచు
నున్నవానిపలుకు | లెన్నుచునాయింతి
వచ్చినిలచెశుకుని | మ్రోలనపుడు॥

అట్టి సమయంబున శుకునియొద్దనున్న మునులు తమలో తామెట్లనుకొనుచుండిరనగా,

సీ॥ పున్నమచంద్రుడో | పుల్లారవిందమో
సొగసైనయందమో | సుదతిమోము
చెంగల్వరేకులో | చక్కనిమీనులో

యంగజుతూవులో । యతివచూవు
జక్కవపతులో । జాజిపూబంతులో
బంగారుగుబ్బలో । పడతిచనులు
చంచలయోగాక । చక్కనిచుక్కయో
కనకంపుతీగయో । కమలగంధి,
యహాహోయిటువంటి । యొయ్యారిననుదినంబు
గలసియుండినమోక్షంబె । గలుగుననుచు
మునులుతలపోసి తమలోన । మోహపడుచు
జెలగివర్ణించుచుండిరా । చింతచేత॥

ఒక్కొక్క మునియొక్క ఆశ్చర్యనిమగ్నత,

సీ॥ వనములన్నియు నేను । కనులజూచితిగాని
కనగాంగియౌవన । కాంతిలేదు
గిరులందు నేప్రొద్దు । దిరిగిజూచితిగాని
సఖికుచగిరులతో । సాటిరావు
భూములన్నియు నేను । బుద్ధిజూచితిగాని
కమలాక్షిమరుభూమి । సమముగాదు
మునివృత్తితోడ జం । ద్రునిజూచితినిగాని
వనితమోముకుసరి । వాడుగాడు,
ఇన్నియునుదిరిగిజూచిన । నేమిఫలము
లంతకంటెనుమిక్కిలి । దైవఫలము
నలుగుభూముల వనముల । గలుగలోక
ములనుజూడంగగలుగునా । ముదితయందు॥

ఇట్లు తపసులు తపంబు విడచి తమినొందునట్లొయ్యారంబు

మీఁర శుకుని మ్రోల నిలచెనని బ్రహ్మ నారదునకు జెప్పిన విని నారదుండీ కథను విమర్శంబుగా వినిపింపుమనిన నలువ యిట్లనిరో,

గీ॥ ఋషులమరులుగొలుపు । రూపంబుతోవచ్చి
శుకునిజూచిపలికె । సుందరాంగి
వెఱ్ఱియోగినీవు । యేమియూపనినున్న
కారణంబుజెపుమ । కరుణతోడ॥

కం॥ పొదరిండ్లలోనమదనుని
చదువులచేజొక్కి-మంచి చల్లనినీడం
బొడలుచు రతులబెనంగుచు
ముదితలతోనుండవలయు మోహముదీరన్॥

కం॥ తరుణుల కుచకుంభంబుల
గరములచేనదిమియదిమి కాయజకేళిన్
బరిపరిరీతులబెనగుచు
ధరనుండినవాడెయోగి తాపసవినుమా॥

గీ॥ అడవులందుండి ఫలముల । ననుభవించి
కొండరాలనువాసమై । గూరనార
లారగించిన మౌనికు । మారులకును
మరియు సౌఖ్యంబుదొరకునే । ధరణియందు॥

కం॥ యీయడవులందునుండిన
సాయుజ్యముగలదెసీకు సన్మౌనివినుమా
సాయుజ్యపదముదొరకుం
గాయజపురమందు సౌఖ్య రతులనుబెరయన్॥

ఇంకను వినుమని వేలుపు మచ్చకంటి యిట్లనియే,

సీ॥ యజ్ఞముల్ చేసిన | సుజ్ఞానులేనియు
గోరుదుర్వాతోడి | కూటమెపుడు
తపములుసల్పెడి | తపసులునే వేళ
గలవరింతురునాదు | కౌగిలికిని
సర్వాంబురోసిన | సన్యాసులైనను
దవళాక్షియనినన్ను | దలతురెపుడు
శాస్త్రసమ్మతులైన | సర్వజ్ఞులందరు
నాపొందుకన్నను | తీపులేద,
టంచుమదిలోన దలపోసి | యూదుకొంచు
నుందురతిచింత జేయుచు | నోమునీశ
నీవునను గూడి రతి కేళి | నెమ్మెలెరిగి
కరముసుఖయింపు సంతోష | కరముగాగ॥

గీ॥ వనములోనెప్డు తిరిగెడు | మునివిగాన
సౌఖ్యమెరుగక తోరంపు | గట్టుపోలె
గదలకున్నాడవిధియొక్క | వెడగువట్టి
వనమునందేమినాదు | యవ్వనముగనుము॥

కం॥ కాయమునుగష్టపరచుచు
నీయడవులనిడుమనంద వేటికినీవు
న్నాయెడ బేముడియుదుపక
నీయెడమరు కేళిదేలి యొనయుముసుఖమున్॥

గీ॥ వెడగుతనముమాని | వినవయ్యనాబుద్ధి
కామ కేళినన్ను | గలసిమెలసి

కూడియున్న మేలు । కొనసాగు ఫలమబ్బు
ముక్తిగల్గునీకు । మునివరేణ్య॥

క౦॥ పురుషుండై జన్మించిన
నరసుడుగానట్టివాని జననముపుడమిం
గిరితోడుత సరివచ్చును
నరులందును ఋషులయందు నరయుముపేర్మిన్॥

గీ॥ బాల్యకౌమారయవ్వన । పౌఢ్యులైన
యంగనలగూడియరలేక । యనుదినంబు
రసిగతజరింపలేనియా । వరునిదైన
జన్మమేల జవ్వనమేల । ప్రాణమేల॥

సీ॥ సుగుణసంపదగల । సుందరాంగులపొందు
జేయలేనట్టియా । కాయమేల
సరసత్వముగలట్టి । సజ్జనుండేనియు
సఖితోడగూడని । సౌఖ్యమేల
కావిపుట్టముగట్టి । కౌపీనదారులై
తీర్థాలవెంబడి । దిరుగనేల
సన్యాసులైమరి । సద్గృహంబులువిడచి
యున్నవారలజన్మ । మెన్ననేల,
నలసటేగాసిముక్తికి । నరుగదగునె
కాంతతోనుండి శ్రీముక్తి । కాంతగూడి
పరవశముబొందియుండుట । భక్తికనుక
సఖినివిడనాడినను మోక్ష । సుఖముగలదె॥

క॥ యీరీతి వేదశాస్త్రము
ధారుణిలో జదివి చెప్ప । ధన్యులుమీరీ
సారార్థ మెరుగజాలక
వీరును వారనుచు జెప్ప । వెఱ్ఱులుసుమ్మా॥

సీ॥ భేదవాద మెగాని । నాదిశక్తినిగూడి
శోధింపకున్నను । శోధ లేదు
కర్మమార్గ మెగాని । నిర్మలంబయినట్టి
జ్ఞానసూక్ష్మముమది । గాన లేదు
యేకాక్షరార్థంబు । నెరుగుదను టేగాని
యేకాక్షరార్థంబు । నెరుగునరిది
హరిమాయకును నేను । వెరువనను టేగాని
హరిమాయ దెలసిన । జాడ లేదు,
మహిమ లేటికిజ్ఞానసం । భందులైన
వారుతరుణులగూడి యీ । వసుధయందు
పరమసంతోష మొందుచు । భావ మెరిగి
పొందిమన లే దెసజ్జన । పుణ్యమూర్తి॥

క॥ యోగీశులైనవారికి
యోగ మెభోగంబుసుఖము నొక్కటికాగా
భోగింపకున్న గల్గునె
యోగార్థము కాంతసౌఖ్య మోమునినాధా॥

ఇవియన్నియు రంభచే వినినవాడై జ్ఞానసౌందర్యములకు యెక్కువ సంతసించి శుకుండు వేదార్థంబుచే రంభను జ్ఞానావస్థకు దేవలయునని తలంచి యిట్లని జెప్ప దొడంగెను.

కం॥ తరుణీమణియీ కాయము
స్థిరమా క్షణభంగురంబు స్థితిగా నెవ్వడున్
స్థిరజదివిగాననప్పుడు
నరకంబనియండ్రుబుధులు నాతులపొందుల్॥

గీ॥ నీటిమీదిబుగ్గ । నెలతయీ దేహంబు
తేటమాటలుడిగి । బోటివినుము
బోటికొంపకేల । పొలతియీ మోహంబు
సూటిదెలియలేవు । సుందరాంగి॥

చ॥ తనువులునిత్యమంచువసు
ధాస్థలిమాయల బొర్లినట్టియా
మునులకు మోక్షమెల్లపర
మూలమునున్న యటంచుశాస్త్రముల్
ఘనతగబల్కఁగాదనువి
కారముబుద్ధియు మిమ్ము వేడ్కఁదా
బెనగినవారలందరును
బెంపుగనెక్కఁరె కామినీమణీ॥

కం॥ కలకంఠి పొందుగోరిన
ఖలులకు మోక్షంబు లేదు లేదనిస్మృతులం
బలుకుచునున్నవి యెప్పుడు
నలినాక్షీనీదుపొందు న్యాయమెనాకున్॥

కం॥ స్త్రీసుఖము గోరువారలు
నాశలచేజిక్కి మోహ వార్ధిమునిగియు

న్నాశంబై చెడిపోవుదు
రోసఖిమీతోడికూట మొప్పదువినుమీ॥

సీ॥ మలమూత్రకుక్షిలో । పలజిక్కికొన్నాళ్ళు
దేలుచుమునుగుచు । జాలనొచ్చి
యోనిముఖంబున । నుండివచ్చు వస్త్రల
గండత్రయంబును । గడచివచ్చి
బాలుడనై పుణ్య । పాపంబులెరుగక
తిరిగితికొన్నాళ్ళు । తెలివిదప్పి
యౌవనకాలమం । దెరుగజాలకవట్టి
మాయచేజిక్కియు । పాయమేమి
యెరుగజాలకనొందితి । నీచతనువు
యోగులమునీకుమాతోటి । భోగమేల
చెలియసుఖమైనపదవిని । జేరుకొమ్ము
పొమ్మునాతోడిపొందు । నీకేలబాల॥

కం॥ యవ్వనము ధనముసంపద
యివ్వసుధనుదిరమటంచు నిరతముమదిలో
నెవ్వరుగోరిన జెమదురు
క్రొవ్విననమదగజముగోత గూలినమాడ్కిన్॥

కం॥ కోరికలు గోరువారికి
ధారుణిలోనరకమంద్రు దపసులు మొదలన్
గోరికలుడిగినవారికి
జేరువవైకుంఠమనుచు జెప్పెదురబలా॥

కం॥ మలమూత్రతకుక్షి దీనికి
వలపేటికి మోహబుద్ధి వదలుము నాపై
కలకంఠి గోడమీదను
జిలికించిన చిలుకరీతి జెడునీతనువున్॥

కం॥ చెడిపోవనున్న తనువును
బుడమిని నిజమనుచు మిమ్ము బొందినవారల్
యిడుములబడి దుఃఖింతురు
కడతేరగలేరు వారు కామినివింటే॥

చ॥ యోనిముఖంబునందున స
ముద్భవమైన యవస్థచాలునో
మానిని మోహమంది ప్రతి
మాలుచు వెంబడి నుండ నేలయా
యోనిని బుట్టినట్టి మము
యోగులరంచు నుతింప నేలపూ
బోడిరో తుచ్ఛభోగముల
బొందిన నేమి ఫలంబు చెప్పుమా॥

కం॥ యోగీశులైన వారికి
యోగత్వమెనిష్టయంచు యోగులు మొదలన్
భావంబు లన్ని మానియు
యోగంబులనుండి రబల యుర్వీస్థలిపై॥

అని మరియు నిట్లనియే

సీ॥ సఖితోడ గూడిన | జన్మహేతువుజాల
సఖితోడ గూడిన | జెడును బుద్ధి

సఖితోడగూడిన । సర్వేశునంటదు
సఖితోడగూడిన । సముడుగాడు
సఖితోడగూడిన । సరసంబువిరసంబు
సఖితోడగూడిన । సత్యహారము
సఖితోడగూడిన । సౌఖ్యవిహీనంబు
సఖితోడగూడనా । శనమునొందు
ననుచు శాస్త్రంబులుగణింప । నదియువినుచు
ధరణినీపొందుగోరిన । నరుల కెల్ల
నరకవాసంబుయమునిచే । గొరతగల్గు
వెలదులనుగూడువాడెపో । వెఱ్ఱివాడు॥

సీ॥ చెలినివిడచినవాడె । శుద్ధుండుబుద్ధుండు
చెలినివిడచినవాడె । శీలపరుడు
చెలినివిడచినవాడె । జగదేకవీరుండు
చెలినివిడచినవాడె । జపితవరుడు
చెలినివదలినవాడె । శేషసంభందుండు
చెలినివదలినవాడె । కులహారుండు
చెలినిద్రోసినవాడె । జీవాత్మపరమాత్మ
చెలినిద్రోసిన మోక్ష । సులభుడగును,
చెలులతోజేరియుండిన । జేటువచ్చు
చెలులతోజల్మిచేసిన । సిద్ధిలేదు
చెలులతోబొందుజేసిన । శేషిగాడు
చెలులతోనున్న పరమందు । జేరలేదు॥

సీ॥ సంసారమునజిక్కి । జాలినొందుటకంటె

నడవులలోనుండు | టదియమేలు
సంసారమునజిక్కి | హింసజేయుటకంటె
నదినిధుల్ జూచుట | యదియమేలు
సంసారమునజిక్కి | జాలనొచ్చుటకంటె
సన్యాసియైయుండు | జాడమేలు
సంసారియైకాంత | సరసనుండుటకంటె
గురుపాదపద్మంబు | గురుతుమేలు,
అనుచువర్తించువారు మ | హాత్ములెలమి
వారుబ్రహ్మంబుగనుగొన్న | వారలవని
దేహమస్థిరమనుచును | దెలివిపరులు
తుచ్ఛభోగంబువలతురే | తోయజాక్షి॥

కం॥ స్థిరమాయా దేహంబ
స్థిరమనియున్నట్టిమంచి తెలివిపరులన
శ్వరమపదవాసులగుదురు
తరుణీమణివట్టిమోహ తాపంబేలా॥

గీ॥ కామజనకువిడచి | కామినినినుగూడి
కలిసియున్న మోక్ష | గతులులేవు
స్వామినామజపము | సలుపుచునేవేళ
నున్నవారెబ్రహ్మ | యోగులబల॥

ఉ॥ కాయమునిక్కమంచునువి
కారపుబుద్ధులు జాలభ్రాంతిచే
మాయలజిక్కి యాసతుల
మానముభంగము సేయుకంటెయా

కాయమువీడి ముక్తి వని
　　తామణితోడుత నున్న మేలుని
న్యాయకయుండుటం దలప
　　బన్నగబ్రహ్మము బొందవచ్చునే॥

సీ॥ కామంబుక్రోధంబు । గాల్చిభస్మము జేసి
　　అష్టపాశంబుల । నష్టపరచి
పంచేంద్రియంబుల । బాధలఖండించు
　　మాయలన్నియుమరి । మంటగలపి
యజ్ఞానములుమాని । సుజ్ఞానులైమది
　　రుచిపాకసంగతుల్ । రోసియవని
నాలుబిడ్డలుతన । యన్నదమ్ములపైని
　　యాశలన్నియుమొద । ల్ద్రోసివేసి,
బ్రహ్మమందుజ్ఞాన । పరుడైనమోక్షంబు
గలుగుపాపమెల్ల । గరగిపోవు
జన్మములకురాడు । సాయుజ్యమునుబొందు
కల్లగాదువినుము । కంబుకంఠి।

గీ। చెడనిపదవిగన్న । సిద్ధుండుమీరొందు
గోరనేలయముని । జేరనేల
వట్టిమోహమేల । వనితనీమాటలు
గట్టిపెట్టవేగ । గదలుమనిన॥
　　అనిన శుకునింజూచి రంభ యిట్లనియె

సీ॥ వేదంబుచదివిన । వెర్రిమాత్రమెగాని
　　వేదార్థనిర్ణయ । వృత్తియరుదు

ఆత్మనేకముచేయు । నదియరుదేగాని
జ్ఞానయుక్తులుపెక్కు । పలుకుటరుదు
బ్రహ్మజ్ఞానంబున । పలుకుటరుదేగాని
బ్రహ్మజ్ఞానంబున । భావమరుదు
దేజమొక్కటియను । తెలివరుదేగాని
దేజంబులోమేలు । దెలియుటరుదు
తనుదాను తెలసితి । ననిపల్కుటేగాని
తనలోనిసందుల । గనుటయరుదు
వీనినన్నింటదెలసిన । వేదవేద్యు
వీనినన్నింటదెలసిన । విశ్వమూర్తి
వీనినన్నింటదెలసిన । విశ్వపరుడు
వీనినన్నింటదెలసిన । చేటులేదు॥

గీ॥ మూలమెరుగలేక । మునులమంచునువట్టి
జాలిచేతజిక్కి । సర్వమైన
నూటి తెలియలేక । బోటినివిడనాడి
యుండనేమిఫలము । యోగమునీశ॥

కం॥ తనునెంచిచూడబుడమిన్
దనకన్ననునీచమైన ద్రవ్యముగలదే
తనుదానుజ్ఞానంబున
దనుగూడివసింపకున్న దత్వముగలదే॥

మరియు నిట్లనియె

సీ॥ సతికన్ననెక్కువ । గతిలేదుపుడమిపై
సతికన్ననెక్కువ । మతములేదు

సతికన్న మిక్కిలి । సౌరభ్యమది లేదు
సతికన్న నెక్కువ । గతియు లేదు
సతికన్న నెక్కువ । సత్యంబుమరి లేదు
సతికన్నఘనపుణ్య । సరణి లేదు
సతికన్న నెక్కువ । చదువులుమరి లేవు
సతికన్న నెక్కువ । జాడ లేదు,
సతినిగూడినతనకుస । ద్గతియుగలదు
సతినిగూడినతనమహా । వ్రతమునిల్చు
సతినిగూడినతనకునా । చారమబ్బు
సతినిగూడినవాఁడెపో । దిపితుడరయ॥

కం॥ హరిహరులు సురలుమునులును
సరసిజభవుడాదిశక్తి జాడలచేతం
దరుణులతో కూడుండిరి
పరికింపగబ్రహ్మభావ పరులై వరుసన్॥

గీ॥ మనసు త్యాజ్యము జేసి । మగువలకూడుండి
రతులజొక్కిసత్య । వ్రతమునిల్పి
జ్ఞానసరణి తెలసి । జ్ఞానానుభవమంత
ననుభవించు యోగి । యాత్మయందు॥

గీ॥ మాయలోపలశక్తి । మహిమతో నెరిగియు
మాయనంటకున్న । మంచిబుద్ధి
మాయలోపలజిక్కి । మాయ లేదనుకొన్న
పోవగల దెమాయ । పుణ్యయోగి॥

మరియు ద్వంద్వార్థక్రమంబును వినుమని ఇట్లనియె,

సీ॥ జోడుకూడినవాడె | సుజ్ఞానివిజ్ఞాని
జోడుకూడినవాడె | జాడవీడు
జోడుకూడినవాడె | జూటరియాచారి
జోడుకూడినవాడె | యీడుజోడు
జోడుకూడినవాడె | చోరుండువీరుండు
జోడుకూడినవాడె | సుజనువిజను
జోడుకూడినవాడె | సుద్ధాత్మబుద్ధాత్మ
జోడుకూడినవాడె | జోగిభోగి
జోడుకూడినజ్ఞానంబు | జూడగలడు
జోడుకూడిననరకంబు | జూడలేడు
జోడుకూడిన తాపర | బ్రహ్మంబు
జోకమేమియు లేకను | జూడగలడు॥

ఉ॥ ద్వయముననంటియుండిపర
తత్వమెరింగియు మూలకారణా
త్రియమునబొంది జాడగని
సర్వమునేకమటంచు మాయనా
లయమునజేరనిల్పితర
శాక్షినికూడి సుఖంచియున్ననా
భయమునుబాపి బోయినఫ
లంబునముక్తియు గల్గుయోగికిన్॥

గీ॥ బ్రహ్మజ్ఞాననిష్ట | పరుడైనయోగికి
నాదబిందుసంధి | బేధమెరిగి

కనులుమూసిముక్తి । కాంతచెంగటనున్న
వాడెయోగిసుమ్ము । వరమునీశ॥

ఉ॥ కచ్చబిగించికట్టి తమ । కంబునదండము జేతబూనితా
జచ్చునవేగుచందమున । సీమలభూముల నెన్ని జూచినన్
గచ్చుతనంబెకానిపర । కాంతనగూడక ముక్తి లేదుపో
యచ్యుతుదానసీవుతర । లాక్షినిగూడిసుఖించి వేడుకన్॥

అని రంభ చెప్పినతోడనే శుకుండు విసుకుపడి, ఓ నలి నాక్షీ నాకు తెలియని సంగతులని యింతమట్టుకు జెప్పనేల నన్ను వలచిన నీకు ఫలము లేదు. యీ క్షణభంగురములైన సౌఖ్యములకు నీవైనను యాసించుట తగదు. నీ వుపన్యాస ములను యిక గట్టిపెట్టి నే చెప్పబోవు విషయమును శ్రద్ధగా వినుమని జెప్ప నారంభించెను.

సీ॥ మాతృకుక్షియుదీని । సూత్రమంతయునీకు
తెలియజెప్పెదవినుము । జలజనేత్రి
యెమ్ముల ప్రోగుని । ట్టెమ్ములపుట్టిల్లు
రక్తమాంసపుచర్మ । రాసిబొంది
నిలువెల్లనరకంబు । నిమిషమాత్రమెకాని
యంగవికారంబు । లైనతనువు
శుక్లవీర్యంబుల । సుఖమైన దేహాకి
మోహంబునీకేల । మోహనాంగి,
నరకకూపంబుదీనిని । నమ్మరాదు
మలినమైయున్నయీమట్టు । మాయకొంప

కేల మోహంబుపుట్టెనో | బాలనీకు
వద్దుతమకంబునీకేల | ముద్దుగుమ్మ॥
అనిన రంభ శుకుని కిట్లనియే,

గీ॥ ఎవరియందుననీలాగు | నెరుగవచ్చు
జూడుమనిరంభ చెప్పెను | శుకునితోడ
గర్భమంతయుజీరెను | నిర్భయముగ
పరిమలంబయ్యెనప్పుడ | తరుణియందు॥

గీ॥ గంధకస్తూరిసొగసైన | కమ్మవిరులు
గర్భమునజూచిసంతోష | కారుడగుచు
లేచినిలుచుండికరములు | చాచిమరియు
మగువతోజెప్పెతానొక్క | మనవియపుడు॥

ఆ॥ పుడమియందుహరుని | పూజించినేనునీ
గర్భమందుబుట్ట | గలుగుముక్తి
ఇంకనైననేను | పంకజాక్షునిగొల్చి
పుట్టియుందునీదు | పొట్టలోన॥

సీ॥ శివపూజహరిపూజ | చేయనేటికినీదు
కడుపునబుట్టిన | గలుగుముక్తి
జపముపవాసంబు | సల్పంగనేలనీ
కడుపునబుట్టిన | గలుగుముక్తి
ఘనమైనవ్రతముల | గాసిల్లనేలనీ
కడుపునబుట్టిన | కలుగుముక్తి
ఘనమైనతపములు | గావింపనేలనీ
కడుపునబుట్టిన | గలుగుముక్తి

యనుచునిటువంటిమాటల । నాడగాను,
సుదతితాలేచిపలికెను । శుకునితోడ
వరమునీశ్వర నేనునీ । వంటివాని
యెన్నడునుజూడనీవలె । నున్నవాని,

గీ॥ అనుచురంభశుకుని । కంజలిగావించి
తత్క్షణంబతా । ప్రదక్షిణంబు
చేసికార్యమెల్ల । జేకూరకున్నదుః
ఖమునసాకమునకు । గదలెనపుడు॥

కం॥ అనిపలుక నలువనారదు
డనురాగంబుప్పతిల్ల నతనికెరగియా
తనిచేననుమతిగొనిచని
యెనునిజభవనమునకప్పు । డింపుదలిర్పన్॥

గీ॥ అనుచుగురుడుపల్కె । యశ్రాంతమిక్కథ
వినినజదువవ్రాయ । జనులకఖిల
శుభములబ్బుమోక్ష । సుఖము జేకూరుసం
శయము లేకనన్ని । భయములుడుగు॥

ఓం శాంతి శాంతి శాంతిః.





# అమృత గులాబి లేహ్యము.

ఈ లేహ్యము వారమునకు ఒకసారి రాత్రి పరుండపోవు నప్పుడు ఒక అరతులము (అనగా వుసిరికాయంత మోతాదు) సేవించి కొంచెము చల్లనినీళ్ళు త్రాగవలయును. రెండు లేక మూడు విరోచనములు సుఖముగా అవును. ఈ లేహ్యము, తినుటకు మంచిరుచిగావుండును. శరీరములోవుండు వాతము అధికమైనవేడిని, మలబద్ధమును పూర్తిగా తీసివేసి రక్తమును శుద్ధిచేసి, ఇంద్రియపుష్టిని కలిగించును. కడుపులోయుండు పాతశూలనొప్పులు, అంటువ్యాధులు వగైరాలు పూర్తిగా తీసివేయబడును. దీనిని ఒకసారివాడినచో అనుభవముమీద మీకే తెలియగలదు.

నోటు:—గుణములేదని ఋజువుచేయువారికి సొమ్ము వాపసు యివ్వబడును. పిల్లలకు మోతాదు తగ్గించియియ్యవలయును.

సీసా వెల 0-8-0 ౧ డబ్బా 1-0-0

అరిసెమొలలు మరియు భగేంద్రాలు 5 దినములలో గ్యారంటీగా బాగుచేయబడును. దగ్గు, దమ్ము, పక్షవాతము, అంటువ్యాధులు, షండత్వము మరియు మధుమేహము 10 దినములలో నమ్మకముగా బాగుచేయబడును.

## పి. రామ్ మోహన్ అండ్ కో

6921, లక్ష్మీనారాయణ టెంపల్ బిల్డింగ్
శికిందారాబాద్-దక్కన్.



# ప్రకటన.




మీ వ్యాపారమును వృద్ధిచేసుకొనవలయునంటె అందమైన బ్లాకులే అవసరము.

అట్టి బ్లాకులు మావద్ద సరసమైన ధరలకు గ్యారంటీగా తయారుచేసి సకాలమునకు అందజేయగలము.

## బ్లాకుల వివరము.

ఫోటో బ్లాకులు
లైన్ బ్లాకులు
ఫ్యాన్సి బ్రాడ్జెస్
సీల్ బ్లాకులు

మొదలైనవియేగాక రబ్బర్ స్టాంపులుకూడా తయారుచేయగలము. ఒక్కసారి ఆర్డరిచ్చి పరీక్షింపుడు.

**ది. మెడ్రాస్ యంగ్రేవింగ్ వర్క్సు**

80, జేమ్సుస్ట్రీట్

శికింద్రాబాద్-దక్కన్.